# జలదాంగన

(పద్యకావ్యము)



కవికోకిల

దువ్వూరి రామిరెడ్డి

కవికోకిల గ్రంధమాల

పెమ్మారెడ్డిపాళెం — ఎల్లాయపాళెం (P o)

నెల్లూరు జిల్లా



# జలదాంగన

నీలపునీరునఁ బండి రాణించుచున్న
పై కపోలముల విహరించు పాటలశ్రీ
యొఱపుఁ బయ్యెద బంగారు మెఱపులనెగు
సంజనిగ్గుల వరిమళ్ళ చాయలాలికె!

పొలముల కాలమేఁపుటకుఁ బొద్దుసనేఁగిన కాఁపుబిడ్డలా
వుల పదధూళిసోఁక నెడవోయెడు దూడ లదల్చికొంచు నిం
పుఱు చికలించు వేణురవము ల్పలికించుచు గూళ్ళఁజేరు ప
క్షులకును మున్నెయూరిదెసకు న్మరలించిరి యాలమందలన్

గగనసీమంతినీ కంఠ గళితమైన
మల్లెపూఁదండ తేకులు దుల్లెననఁగఁ
బైనఁ జరియించు కొంగల బారు లెంతో
యలరుచుండెను దర్శనీయంబులగుచు

ప్రకృతి యెల్లను శాంతమై పరఁగుచుండ
శాలి కేదారములలోనఁ జలగాలి
నల్ల నల్లన విహరింప నుల్లమందు
నంతులేని యానందంబు నందుచుంటి

కనుఁగొనుచుండఁగా జలదకాంతల కుచ్చెలకొంగ చెంగలం
దనరు జపాసమార్ద్రరుచి దగ్గను, దిక్కుల నుప్పతిల్లె నం
తనె యిరు, లక్కడక్కడను దారకలుం గనుపట్టె మిక్కుమం
చనయము మిణ్గురుంబురువు లాడుచునుండెను జేఁగ ట్రులన్

గగన రత్నాకరంబు నాగ్రహమునొంది
కాలమనెడు నగస్త్యర్షి, కమలబాంధ
వాంశునీరమ్ము గ్రోలిన నచటఁ దోఁచు
రత్నములనంగ నక్షత్రరాజి మెఱయు.

అంత సుధాంశుబింబము వియత్తలమం దుదయించె నా రతీ
కాంతుఁడు యామినీరమను గాంచుటకుం జను వేళ మల్లెపూ
బంతి శతాంగముం జలదబాటఁ జకోరపు వారువాలచే
వింతగఁ బూన్చెనా మొయిలుపిండిహిమంబుగ రేఁగునట్లుగన్

గగన స్రవంతికా కల్లోలడిండీర
ఖండంబు లభ్రమ్ము గప్పెననఁగ,
నందన కల్పద్రు సందోహములు పూచి
యెల్లెడఁ బుప్పొడి చల్లెననఁగ,
ప్రాగద్రి శిఖర ఘర్షణమునం దొలివడి
యుడుభర్త యమృతంబు నొలికెననఁగ,
ఉన్మత్త కరిదంత దీప్తులాకాశ ద
ర్పణమున బింబించి వఱలెననఁగ,

శర్వరీ మందిరాంతర స్థంబులైన
హీరమణి దీపముల కాంతి సారమనఁగ
మెత్తఁదనమును శైత్యమ్ము మిళితమైన
పండువెన్నెల నల్గడ నిండుకొనియె!

వెన్నెలఁజూడ నందమగు వేసముదాలిచి కొండనెత్తమం
దున్న పయోదమొండు పవనోపహతిన్ మెలమెల్లనూగుచున్
సన్నని యంబరంబటులఁ జంకురుఁగప్పుచు వీఁగిపోవు చె
న్నెన్నొ మనోహరాకృతుల నెత్తుచుఁ గన్నులఁగట్టె వింతగన్.

# జలదాంగన

చూడనుజూడ నందమగు సుందరి రూపుధరించి, వేణి రా
పాడు జరీముసుంగు హరిణాంకు కళన్ని్నసలాడఁ గాంతునిం
గూడి నభో విహారవన కుంజతలంబుల సంచరించు పె
న్వేడుక రోహిణీ రమణి వే యరుదెంచెననంగఁదోఁచినన్

జలదకాంతను గాంచి యాశ్చర్యమొంది
కన్నువాల్చక నందమ్ము గనుచునుండఁ
గవి కుమారుఁడ నొటఁ దక్షణాన నేను
భావమున నబ్ద సారూప్యపదవిఁబొంది

చెలియ! యభీష్టరూపములఁ జిత్రగతిం జరియించె దీవు, నీ
చెలువముగాంచ మోహిడయినచిత్తముగూడఁజిగిర్చు, నేలొకో
వలిపపు మేన్ముసుంగునిడి వచ్చితివొంటిగ, వాసమెద్ది, యెం
దుల విహరింపఁబోయెదవు, తొందుదుకొందక నిల్చి తెల్పుమా!

నిన్నుఁగనుఁగొన్నదాదిగ నీదు చరితఁ
దెలిసికొనఁ గౌతుకంబు చిప్పిలెడి నబల,
యెవరిదానవొ? తలితండ్రు లెవరొగాని
ఘనుల సంతతిగా నీవుగానఁబడెదు!

అనవిని కాంత యిట్లనియె నంత మదీయచరిత్ర మెంతయున్
వినుచు విషాదమోదముల విచ్చినచిత్తముతోడ దైవసృ
ష్టిని దలపోసి యుబ్బురముఁ జెంద నభీప్సితమేని నాకధన్
వినుము కవీశ్వరా, ప్రణయవిస్మయముల్ తలపున్ హారి పగన్

నీవెఱుంగని వింతలు నిమనంబు
చొచ్చు శక్యంబుగాని దెచ్చోటఁగలదు?
ఐన నానోటఁజెప్పింప నాసయేని
వినుము పుట్టుపూర్వోత్తరంబును కవీశ!

జలజభవుండు సూర్యుఁడు నిశాకరుఁ డుర్వియు, దారకల్ దిశల్
కులగిరు, లివ్వియివ్వి యనుకోఁబనియేల? సమస్తమున్
సలుపకమున్న నాదు సరసంబగు పూర్వపు రూపానర్చె న
న్న లవము నాత్మసంస్తుతి యనంజనరెమ్మొయిఁ దత్వదర్శనుల్!

జంట విసుంగులట్లు నను సంతసమ్మునుగాంచి మాయవా
ల్గంట యదృశ్యగాఁగఁ గడగండ్లను సైపుచుఁ దల్లిలేని మా
చంటి తనమ్ముపుచ్చ, నిమిషమ్మును వీడనిమమ్ముఁ బాప మా
యింటనుగాన్ని గోళములు హెచ్చెను లెక్కకుమిక్కుటంబుగన్

అనుజను గోలుపోయి మదియుం దెడవోని వినియోగ వేదనన్
వనరుచునుండఁ బృథ్వియను బాలయొకర్తుక చేరవచ్చి న
న్ననునయ వాక్యముల్పలికి, యార్తియొకింత శమింపఁ జేసినా
మనమునకెక్కు దాస్యమున మాగృహమందె వసించియుండినన్,

కాలుఁ డనియెడు సుందరాకారుఁ డొకఁడు
మమ్ము నిరువుర నీక్షించి మానసంబు
ప్రణయముగ్ధంబుగా వచ్చి వలపుదెలిపి
పరిణయం బాడె సౌఖ్యసంపదలు పొదల

కొన్నిదినాలు మువ్వురముఁ గోరికలీరికలెత్త సౌఖ్య సం
పన్నతఁ గాఁపురంబు సలుపన్ ఫలియించెను నాదుగర్భ, మా
పన్నతనొంది పృథ్వి మదిఁ బాటిలునీసున నాసుఖంబు సైఁ
పన్నరింతలేక చలపట్టి గృహంబున బోరువెట్టుచున్

ఆక్రమించెను నావాసమందుఁ గొంత
స్థలము, 'నదియేమె' యన్న 'నీసవతిఁగా నె
హక్కు లేదఁటె? నాకింట' ననియెఁ బృథివి,
చేరదీసిన ఫలితంబు సిద్ధమయ్యె!

ఇది పతివచనవని గనుఁగొని
తుద కేమియుఁ జేయ లేక దుఃఖముపాలై
కుదురెఱుఁగక తొందరపడ
నొదవెను నీఫలమటంచు నూరకయుండెన్

అంతటఁ గొన్నేండ్లకు నా
కాంతకు సంతానవృద్ధి గలిగెను నైనం
బంతంబు విడదు న సయి
నంతింతకు లేని తగవులాడుచు నుండున్

సవతులకు గిల్లు జగడాలు సహజమైన
బిడ్డలైనను నొండొరు ప్రీతిమెయి
నొఱపు పొరపొచ్చములు లేక యుందురన్న
నదియు నొనఁగూడదాయె నీర్ష్యాళులగుట

అసురులకు న్నిలింపులకు నయ్యెడు తియ్యని పోరులట్ల వె
క్కసముగ మాయపత్యములు కయ్యములాడుచునుండఁ బృధ్వి
యుం గసిగొని మందమేలమునఁ గాంతుని చిత్తము మురిపించి
యుం వెసం గెడు బుద్ధి నాత్మజులకీ నొనరించె రహస్యరీతిగన్

పైతృకంబగు "బుద్ధి" సంపదనుబడసి
విఱ్ఱవీగుచు మమ్ముల వెతలుగుడుప
నెన్నొ సాధనములఁబన్ని యెట్టయెడకు
నాడు సంతతిఁబట్టి తినంగనైరి

అంతంబోక మదీయగర్భమున గోప్యంబౌనటుల్ చేర్చినే [ముల్
నెత్తో మక్కువ దాచియున్నమణులున్ హీరంబులున్ ముత్య
కాంతింజిల్కు ప్రవాళవల్లులు బలాత్కారంబుగా నాచికో
శాంతింజెందునె నామనంబెటులనో సైరించుకోఁబోయినన్?

తనరె బలంబటంచు నిదిధర్మ మధర్మ మనాక కార్యముల్
పొనరుచు పృథ్వ్యంతతుల పోతరముంగని యింతగర్వముం
డినఁగొనసాఁగునే కడకు డెప్పర మౌనని యెంచికొందు, నం
తనె శివమేల? యెప్పుడయినం దుదిదాకవె దుష్టకల్పనల్?

తమకు బలంబు శౌర్యమును ధైర్యమునిచ్చి సమస్త సౌఖ్యముల్
క్రమముగఁగూర్చి వైరినికరంబు పదానతమౌ సమీకమా
గ్రము గనిపించుబుద్ధి ముదర ద్వేషమించి నిజాశ్రయంబుగా
ప్ప మొదలువెట్టెఁ, బరిపాటికి మించిన నిర్దయాఁ గదా!

ప్రకృతిశాస్త్రంబు విద్యయు భవ్యకళలు
గావసంపూర్ణతకుఁ దోడుపడుటమాని
ప్రజల నాశనమందె పర్యాప్తమగుట
దాపురంబయ్యెఁ బుడమికిఁ బాపఫలము

నాతలుచేసి, నాహృదయ నాళములెల్లను జుంజురౌనటుల్
త్రోవలుదీసి, యాత్మకడఁదోసి, శరీరసుఖంబెగోరి యీ
స్వావిలచిత్తులై తుదకు సందఱు భోగము కారణంబుగం
గావలమెత్తిపోరిరి వశావశులై తమతల్లి బెగ్గిలన్

గారవించిన నాగరికంబు కడకు
ధూమ ఫూత్కారములలోనఁ దూలిపోయె
మనుజసంతాన మాహవ మత్సరమునఁ
గంఠదళనా వినోదంబు గడపు నహహా!

నన్నుఁ బెట్టిన కష్టంబులన్ని సవతి
పొందుచున్నది పుత్రుల మూలమునను,
కన్నబిడ్డల నెత్తురు కాల్వలందు
నీఁగుచున్నది పృథ్వి వహించి యెటులో!

క్రోలుచుండిన తరుణంబు గూడికొంట
సవతి పుత్త్రుల రక్తంబు చవులువుట్టఁ
దనివి దీఱఁగ నేను సంతానములును
దాఁగివినారము క్షీరపూరంబు లటుల!

మాటకుమాటవచ్చి చనుమానముతో నిటులంటిఁగాని నా
కేటికి మున్నమున్న శమియించిన గాధలు ద్రవ్వికోఁగ, నా
పాటికి నంతరాళమునఁ బర్యటనం బొనరించి పిన్నబి
డ్డాటల నాడికొందుఁ బవనార్భకుఁడర్మిలినన్నుఁగూడఁగన్,

అనవిని పల్కెతి జలదాం
గన, యిట్టిసురూపమెటుల ఘటితంబయ్యెన్?
మునువున్న వనధిరూపం
బును నెట్టుల మార్చితివి అపూర్వప్రరీతిన్?

తెలుపుమటన్న, నానవును, దెల్పుటకు న్విషయాంతరంబు వ
ర్తిలుటయు నెట్టులో మఱచితిన్, వినిపింతును శేష,మిద్ధరన్
గలుములు లేము నెప్పుడు వికారము లొందక యొకరీతి ని
శ్చలముగ నుండఁబోవనెడు సామెత సీ తెలుఁగంగ రానిదే?

కొన్ని దినములు చీఁకటి కొన్ని నాళ్ళు
వెన్నెలనియెడు లోకోక్తి విదితమయ్యె,
నాకు మనసీక వర్తించు నాహృదీశుఁ
డెలమి వశవర్తియయి నన్నె వలచియుండ,

ఒకనాఁడిద్దఱ మిష్టగోష్ఠిఁ బ్రణయం బుప్పొంగి లోకంబుదోఁ
పక సౌఖ్యంబులఁ దేలియాడి కడకున్ భావంబు శాంతింప నా
యకలంకంబగు పారవశ్యమును నెయ్యం బారవర్ణించి మా
మక సౌందర్యరసాబ్ధి నీఁదుచు వచోమాధుర్య మేపారఁగన్,

కాంతుఁడు ముద్దుచెక్కిళులు కమ్మనినవ్వు ముసుంగులోన సం
త్రిత రాని నొఱు రచియింపఁగ నింపగురీతిఁ బల్కె 'నో
కాంత క్షమింపు మున్న నినుఁగన్నులఁ గప్పికొనంగ లేక య
త్యతి ముపేక్షతో మనముదాఁచిన నావిరసంపుఁ జైదముల్!

'వెడలె గ్రహచార వేళయుఁ' బృథివియన్న
నివ యన్నను వేఱేమి నీరజాక్షి
మునుపు సలిపిన యపరాధములను మఱచి
నన్ను నీదాసునిగ నేలు మన్న వినవె?

'కలదు రహస్యమొకండు, కినుక న్వహియింపకు మోసమంచు నే
జెప్పక యూరకుంటిఁ బొలఁతీ! గతమెప్పటికిన్ గతంబె, యం
దులకు విచారమేల? ననుదుష్టుఁడ నంచు దిరస్కరించి నం
జెలిమి నెఱింగి దగ్గరకుఁ జేర్చిన నియ్యవె పాపపుణ్యముల్?'

అని మగవారికిం దెలుప నల్కు జనించెడు నెన్నొతియ్యముల్
మనము గరంగఁ బల్కనను మన్ననవేడి, యనంతరంబు జం
కును గపటప్రచారమునకు న్వాడనవ్వును సిగ్గుదోఁప ని
ట్లనియెఁ బ్రియుండు నాతలఁపులాకుల పాటున సంచలింపగన్

వనితా! యేమని చెప్పువాఁడఁ? బరిణయవ్యామోహచిత్తుండనై
గను గాలుఁడను పేరఁ జేరితిని నే నీరేజబంధుండఁ బ
చ్చని గుఱ్ఱంబుల తేరిపై గగనసంచారంబు గావించుచుం
దును, నారూపమెఱుంగఁ గోరికయినం దోడ్తోన వీక్షింపుమీ,

అని వచియించి, కాంచనశతాంగము హీరకిరీటమొప్ప మో
హన నవకాంతులీనెడు సహస్రకరంబులతోడ వెల్గుచున్
గనులకు వెక్కసంబగుచుఁ గానఁబడెం దలయెత్తి చూడలే
క నిలిచియుంటి నూరక వికారము నొందని ఱాతిబొమ్మగన్

అంత నిజస్వరూపము దయామయుఁడై కుదియించి సూర్యుఁడం
'గాంత' ప్రభాతకాలమునఁ గాంచనచేలము దాల్చి నామనం
బెంతయు మ్రుచ్చిలించితివి యింక నినున్విడనాడఁజాల, నా
చెంత నె సర్వసౌఖ్యములు చేకుఱుఁ గాఁపురముండుమీ' యనన్

కలలోఁదోఁచెడు వింతమార్పులటులం గాలంబునందోఁచె నీ
జలజాతాప్తుని బ్రత్యహంబుఁ గనుదున్ సంతోషమేపార నీ
చెలువంబుం గమనీయమూర్తియును నే సేవింపలేదింత కొ
చ్చెల! నాభాగ్యము పండెఁగావలయు నీచిత్రంబు సంధిల్లుటన్

ఒక్కనిమిషంబులోన నాయుల్లమపుడు
పూలతేఁకుల ఱెక్కలంబూని యెగిరె
స్వర్గపవనంబు వీచు నావరణమునకు
నౌర! రూపాంతరం బెత్తినట్టు లయ్యె

అభ్రసంచారియౌ మోహనాఢ్యుఁడేడ?
క్రింద ఘోషించు నేనేడ? క్రీడయేడ?
అందరాని ఫలంబుల కాసచేయు
నట్లు ప్రణయ పర్యవసాన మానొ యేమొ?

అని తలపోసికొంత, ప్రణయంబు ముదంబు విషాదమున్ మనం
బునఁ బెనఁగొన్న లోనఁగఁబుచ్చి హృదీశునిఁగాంచి కాంత యి
ట్లనియె, మనోహరా, గగనమందుఁ జరించెదుమీకు నాకు నె
ట్టనువగుఁ గాఁపురంబు మనుపట్టులెవ్వత్రము భావికాలమున్

అయిన ననుఁగొందు, మీదు పాదాంబుజముల
రజములకు నైన సరిపోఁ దర[illegible]బె నాకు?
అట్టి నన్ను వలచి రూపాంతరంబుఁ
ఊను టెంతయు నాపూర్వ పుణ్యమే మొ!

అనవిని సూర్యుఁడిట్లనె
మనమున నెల్లెంతో నీవు మానిని, నీ రూ
పును గాంచ దివ్యసుందర
తనువటు గన్పట్టు నాకుఁ, దథ్యంబిదియున్

శీకరమౌక్తికంబుల రచించిన కంకణపాళి మార్చి వీ
చీకరముల్ మనోహరపుఁ జిట్టకముల్ పచరింపఁ జూఁపి సం
ధ్యాకమనీయ వేళల ముదంబున నం గవుఁగింటఁ జేర్చు నీ
నాకతము న్మదిందలఁప స్వర్గసుఖమ్ము సధఃకరింపదే?

అఖిల సామ్రాజ్యమునకుఁ బట్టాభిషిక్తఁ
జేసెదను రమ్ము నాతోడఁ జెలువమిన్న
లోక మెల్లను నీయాజ్ఞ లోఁగియుండ
నేలెదవుగాక సస్యవిశాలధాత్రి'

అని కరముల్ సహస్రమును నల్గడఁ జాఁపి ప్రవాహదశాప్పవిం
దు నికరముల్ దొరంగ నవతోయజమిత్రుఁడు గాఁగిలింప, నే
మని వచియింతు బాష్పమయనై యుపగూహనమందె లీనమై
తి. తదనంతరంబు నను దేఁటువఁ జేర్చె నభోంతరాళమున్

వలిగాలిం దనుతాపముం దొలఁగి దివ్యంబైన యీరూప ము
జ్జ్వల శంపాభరణంబులుం గలుగ నే సంతోషముం బొంది ని
చ్చలు వాతార్భకతోడ నీతలములన్ సంచారముం జేయుచున్
మలనెత్తంబుఁ దీవటా వరుల లోనం జేరి క్రీడించుదున్

సాంధ్యవేళల ఎడమటి చఱులయందుఁ
బొటమరించెడు నపరంజి పొడుపుకేటి
యందు నీరాడి, పెన్నెలు లాఱ్పుకొనుచు
వచ్చుచుందును గవుల భావంబు లలర!

పండువెన్నెల లలరు శర్వరుల యందు
వలిపపు ముసుంగు నోరగా వలనుపఱచి
వెన్నెల పులుంగు పిల్లల చిన్నినోళ్ళ
నమృతరసముఁ బూని తా నెయ్యంబు గగుర

ప్రొద్దువొడవున విరియు క్రొంబువులయందుఁ
గాఁపురంబుండు నిందిర కంఠసీమ
మంచుతుంపర ముత్యాల మాలగట్టి
వైచుచుందును నానందవర్ధనముగ

ఆభ్రగంగాప్రవాహంబు నవల దాఁటి
గమ్రమణుల సురేశుండు గట్టినట్టి
యింద్రధనువను వంతెన నెక్కిపోదు
జలక మాడిన తెరగంటి చెలులతోడ

కనులకు నిచ్చ క్రొత్తలయి గానఁగవచ్చెడు వింతలెల్ల నేఁ
గనుచు నభోంతరాళమునఁ గాంతునితోడ వసించియుంటి నం
తన మఱికొన్నినాళ్ళకు నతర్కితరీతి నెఱుంగనయ్యె నా
యునికి వసాళిమోసము, మిఁక నెంతయొనర్పఁగ నంగవింపఁడో!

ప్రొద్దున శయ్యనీడి చెలి పోయెదనంచు వచించి యేఁగుచో
నెద్దియొ సందియంబు మది హెచ్చ రహస్యపురీతి వెన్నడిన్
సద్దొనరింప కేఁగుచుఁ జల్లఁగఁ బోయెను నంగిమెల్ల నిం
కెద్ది వచింతుఁ బో కలుగనే కలిగెన్ సవతమ్మ నాకనున్!

నను నటు నమ్మఁబల్కి గగనంబులకుం గొనితెచ్చి, పూర్వపుం
దనుఁ దొలఁగంగఁ జేసె, మమత న్ననుఁ బాయని పిన్నపాపలన్
మనఁ గొనఁ యింక లేక విడనే విడివచ్చితి నింతకున్ ఫలం
బనఁగ సరోజినీశుని నగ్రిఁ బెడిలియ్యెఁ గ్రమ్మలన్!

అలరులబంతి యంట! తనువందిన కమ్మని మోహమంట! సొం
పొలుకు మిఠారియంట! తనయుల్లమునం గలకొత్తపంటయం
ట! లలితచిత్రయానఁట గనంగన ముద్దులమూటయంట! యీ
పలుకులఁ గొంతుఁ జే సవతిఁ బల్కఁగ నేవిని యెట్లొర్వఁగన్?

కొదమ పిసాళి తుమ్మెదలు గుంపు ఝుమ్మని పాటపాడ వా
యుదళిత చంచలోర్మికల యుయ్యెలనూఁగుచు జిల్గుమంచు ప
య్యెదవర మోముదోఁపఁగ పయిన్ముసుగట్టులవైచి పద్మినీసుదతి
పరిమోదముం గొలుప సూర్యుఁడు నావలిపమ్ము దీయుచున్

అలరులమిన్న, రమ్మని సహస్రకరంబులఁ గౌఁగలింప నా
జలజ లతాంగి యంగమున సన్నవిపుల్కలు నాఁటవోసిన
ట్లలరఁగ నింతమోము నీకసంతగ విచ్చి యొయ్యారపుం దెఱం
గులఁ బతిచిత్తముం బడయ గోడడకి పదె నన్ను మిత్రమా!

కామినికి బ్రాణతుల్యుఁడౌ కాంతు డెవతో
యొకతె వలపింప ముగ్ధుఁడై యుల్లమిచ్చి
మొదటి కాంత నొప్పరికింపి పోవు - తఁగు
గొంతుఁ గోయ లేఁడే తడిగుడ్డఁ జుట్టి?

ఖరకరుండఁట! లోకంబుగాల్చునంట!
అట్టివానికేఁ జిత్తమింకెట్టు కోమ
లంబుగా నుండు? మోహవిలాస ముగ్ధ
నాటఁ గపటంబుఁ దెలిసికోనైతినకట!

నన్నొక భోగకామిని యనం దలపోసి యభీష్టసిద్ధి యౌ
ట న్నను వీడనాడి కొలట న్జలజాంగనఁ గూడెనేమొ! యీ
తెన్ను నెఱుంగకుంటఁ గడ తేఱఁగ రాని సపత్నిమత్సరం
బెన్నుచు వంతలం గుడుచు చెట్టులో కాలముపుచ్చ నేర్పడెఁ

ఇది యిటులుండఁగానె మఱి యింకొకవార్త వినంగనయ్యె న
య్యది వినఁబుంట నుప్పిడిసయట్టుఁల, గాల్చినసూది వీనులం
దదిమినరీతి నయ్యె నవురా! తరుణార్కుని దుండగంబు దా
నిదివఱ కొక్క ఛాయయను నింతిని నిల్లె యొనర్చెనంటకా!

అంతకంతకుఁ బతి యకృత్యములు హెచ్చఁ
జల్లనై చిన పాలునా జవిఁ మనము
విఱుగ నాత్మహత్యయుఁ గొంత ప్రియమటంచు
నంత హిమగిరి కేఁగఁ బ్రయాణమైతి

అంచలబారు మానస సరోంబు విహారము గోరి పోవుచోఁ
గాంచి తటస్థమయ్యె విధికల్పన నర్హపుదారితో డటం
చెంచి, యలంత లేక పధ మేడ్త అనాగ వచించు గాధ లూ
కొంచునె మంచుకొండ యెడకుం జనఁగల్గితి నాసపెంపునన్

అరరే! యేమని దెల్పుదాన సుకవీ యాకొండయందంబు! ని
బ్బరమై మంచొలికించు తెమ్మెరలు వీవన్ దిక్కు లివ్వంచుఁజూ
పఱు లెన్నంగ నశక్యమాట, నచటం బల్లంబులు న్మిట్టలుం
దరులుం గాల్వలులోయలంచుఁ దెలియనాక్రిండఁ జూపట్టెడిన్

జలదాంగన

అంబుధరగర్భములు చీల్చి చాకసమున
హిమధరాధర శృంగంబు లెటిగి యెదిగి
కన్నులకు నందు మేరలకన్న దాఁటి
తారకామండలంబును దాఁకుచుండ.

తరువులెల్లఁ దుషారంబు దవిలిగడ్డ
గట్ట, నద్దంపుఁదునకల కళలు దేలి
మంచు ముసుఁగులఁ బచ్చ రాణించుచున్న
చివురుటాకు జొంపంబుఁ జెలువుగొలుపు,

శీతగిరి గాంచినంతనే చిత్తమందు
వెలుఁగుచున్న నమర్షకీలలు శమించెఁ,
జుట్టుపట్టుల నడయాడి చూతమంచుఁ
దరలితిని మంచుగడ్డ నెత్తమ్ములకును

అనవిని నేను బల్కితిని 'యంగన' నీదగు భాగ్య మేమి నే
ప్పను! గనుఁగొంటివే కనులపండువుగా హిమవద్ధరాధరం
బునఁగల వింతలన్నియుఁ? బ్రమోదము ఫుట్టెడి నీవుదెల్పఁగా
విని యిఁకజూచినం గలుగు వేడ్కలకుం బొలిమేరలున్న వే?

‘ఏనును నీపరికారముగ నెక్కడికైనను నేఁగు రూపముం
బూన వలంతినైన హిమభూధరశృంగము లెక్కియాడమో
దానఁ జివుక్కుమం చెగిరి దాఁటనె! యంతటి నోము నోఁచు లే
దో నరులక్కటా! గఱుతో నొకపుణ్యగ నైనబుట్టనే?

అనవిని యంబుదాంగనయు, నౌనవు! నాగిరి యందమాడకీ
వును జని చూడకున్న ననుబోఁటి వచించిన యంతమాత్రఁ దీ
ఱునె తమి, పుట్టతేనియలు గ్రోలినవాఁడు రుచివ్వచింపఁ దీ
వును నెఱుఁగందరంబె యొకబొట్టయినం జవిచూడకుండినన్ 2

అవ్వుఁగాని యటుమీఁద, నాకొండ మంచుగ
డ్డలువ్రీలఁ బగుళుల నొలుకుచున్న
సెలయేళ్ళు వెండికమ్ముల లీలఁ జాల్కొన
నటకేఁగి చలినీళ్ళ యందు దోఁగి
బలువైన మంచుతుప్పలు గాలిఁ దూలిన
నొరగా నటునిటు నోసరిలుచుఁ,
గన్నులుగట్టియుం గట్టక మాయమా
కలయట్లు నెల్లెడఁ గలయఁదిరిగి

విష్ణుపాదాబ్జమునఁబుట్టి విన్నువాఁక
వెడలు గుహ కడ నొకకొంత వేచిచూచి
శంకరుని యెద్దుగిట్టల జాడఁబట్టి
గదలిపోతిఁ గైలాస శృంగంబు దరికి

ఎడకాల మంజీర మింపుగా రవళింప
గుడికాల బిరుదంబె గులుకుచుండ
వలకేలఁ గంకణమ్ములు ఘల్లుమనిమ్రోయఁ
గడికేలఁ గాప పెందొడవు లలర,
వలరొమ్ముపయ్యెద వలపుగుబ్బలి నిక్కఁ
గుడిరొమ్ము బూది నిగ్గులఁ జెలంగ,
ఎడమకొప్పెద దావులీను గేదఁగిపూవఁ
గుడితల నెలపువ్వు గొమరునూప,

డక్కచేనూని, మేనులు సొక్కిసోలఁ
బ్రమథగణములు నాడుచుఁ బాడుచుండఁ
బ్రకృతి యాత్మయు మిళితమౌపగిదిఁ దాండ
వించు నర్ధనారీశ్వరు వేడ్కఁగంటి!

అక్కడనుండి దేవతల యక్కజదీర్పఁగ మన్మథుండు దా
నెక్కటి పూవువిల్లు గొని యిందుకళాధరు నోఁపవచ్చినం
గక్కసమెత్తి నెన్నుదిటి కంటిసెకం గరఁగించినట్టి యా
ప్రక్కకుఁబోయి చూడనటఁ బట్టదు పచ్చని పూరియేనియున్

బదరికాశ్రమ వాసులౌ పరమమునుల
యజ్ఞవాటులు నేఁటికి నలరుచుండు
నెండ కెండి వానకు నాని యిప్పటికిని
నమరు నచ్చోట యూపకాండములు గములు

అటనుండి విధి వశమ్మునఁ
నటరుహా వల్లీ నికుంజ తతుల మనం బు
త్కట మోదంబునఁ దేల్చెడు
మటఛాయల కొలనుగాంచి మంజులమనుచున్

విమలజలములఁ గ్రుంకిడ వేడ్కగలుగ
మునిఁగితినో లేదో యంతలోఁ దనువునందుఁ
బులక శక్యంబుగాని వెంజలియు వణఁకు
గదిరి యటునిటుఁ గదలు లాఘవము దొలఁగ,

అక్కటా! మోసమంచు శోకార్త నగుచు
దిక్కుదెస లేనిదాననై సొక్కుచుండి
ప్రాణమేఁగిన మెయి కట్టెవాలు నటుల
మంచుటాయిగ నంతలో మారిపోతి!

అప్పటి వాయుదంత మిసుమైన నెఱుంగను, లేచి చూచుకో
న్నప్పుడు లేఁతసవ్వు లోలయుఁ జలజాప్తుఁడు జేరవచ్చి న
న్నొప్పరికించినట్టి కొల యూరడగం బరిచర్య సల్పినం
దప్పుతమించమం చడుగఁ దగ్గఱ నిల్చియె యుండె దీనుఁడై

ఆతని నవ్వ్యాగాంచి హృదయంబునఁ బట్టఁగరాని రోషము
త్ర్యాతతరీతి గుబ్బటిల నాస్యముఁ జూడఁగనైన రోసి నా
నూతనమైనరూపము గనుంగొని నిర్ఝరగర్భమందు సం
ప్రీతిగ లీనమైతి, నిదిమేలె యగుంగద నన్నుబోఁటికిన్!

పగ దలపక నాకష్టపాటు గాంచి
సవతి యైనను పృథ్వినాసరసఁ జేరి
యార్తి యొకకొంత శమియింప ననునయించి
న్నుఁ దనయుఁట నిలిపెను గొన్నినాళ్ళు!

## జలదాంగన

ఏమిది? యున్నయంత తడవేమియు లేదుపగూహనంబునన్
గోమలి బాష్పరూపనయి కూడనయేఁ? నభోంతరంబునన్
శ్యామల కోమలాంబుదమునై చరియించుచున్నదాన నిం
కేమన నేమిలాభము? కవీశ్వర, యాయెను బోయె నింతకున్

ఇంతకైనను సద్గుణవంతుఁ డగుచుఁ
గాఁపుర మగడు సేయుక గడపకున్న
నింక నీమోసముల నెవ్వరెఱుఁగివత్తు
రంతకూలికి విమమాను కాంత యెవతె?

అని వచియించుచుండునెడ నల్లనఁ జల్లనిగాలి వీవ నా
వనద లతాంగియు న్మనుఁగుపయ్యెద వే సవరించుకొంచు న
న్గని కవిశేఖరా, నిను వకాండము వీడి చనంగఁ జిత్త మొ
ప్పని యటులుండియుం జను టవశ్యకమాటకుఁ జింతగల్గెడిన్

నవురు వెన్నల కమ్మదనాన మూరి
యవని యెల్ల నానందమయంబు గాఁగ
బండి యొరఁగిన మొలగొల్కు పైరుచేల
కడకు రమ్ము పరస్పరేక్షణము గలుగ,

అను చలువోకసేఁగు జలదాంగనఁ జూపులకందు మేరకుం
గనిగని, బాష్పపూరములు కన్నులఁ గాఱుచునుండ చిత్తమో
హాన శిశి రాంశుబింబము వియత్తలమందు రహించియుఁ దెస
ల్గనఁబడవౌర! యాత్మవికలత్వము కన్నులఁ గప్పిపుచ్చుటన్

ఒలసెడు పిల్ల తెమ్మెరల యూర్పుల నీకలు మేన రేఁగఁగం
బులుఁగులు గూళులన్నిదురబోవుచు, నెండినయాకుజొంపముల్
గలగలలాడ మేలుకని గమ్మఁగనార్చెడు నల్కఁడొక్కఁడే
చెలఁగెడి తోడుగా గృహముఁజేరి శయించితి వేగుజామునన్.

చల్లవెన్నెల, వలిమల, జలదకాంత
మంచుతుప్పలు, సెలయేళు, లంచబారు,
లిందుశేఖరతాండవ మేమొ యేమొ
కలను గాంచుచు నిదుర మేల్కాంటి నపుడె!

సంపూర్ణము.

